# పిలుపుల పిల్లి

జపాను జానపద కథ

కొకా నిశిజుకు, బొమ్మలు: రోసేన్



చాలా రోజుల నాటి సంగతి. జపానులో ఒక సముద్ర తీర గ్రామంలో యొహేయిా ఇంటి ముందు వానలో తడిసిన ఒక తెల్ల పిల్లి కనిపించింది. యొహేయిా చాలా పేదవాడు. అయినా  పిల్లిని లోపలికి రానిచ్చి తన రాత్రి భోజనాన్ని దానితో పంచుకున్నాడు. ఆ మరునాడు ఆ పిల్లి మాయమైపోయింది. తరవాత, యొహేయిా తండ్రి జబ్బుపడినప్పుడు అతనిని చూసుకుంటూ ఇంటిదగ్గరే ఉంటే చేపలు అమ్మేదెలా, ఇల్లుగడిచేదెలా అని యొహేయిా బాధపడసాగాడు. యొహేయిా చేసిన మేలుని మరిచిపోని తెల్ల పిల్లి తన పంజా ఊపుతూ కొనుగోలుదారులను తీసుకుని వచ్చి సహాయం చేసింది.

# పిలుపుల పిల్లి

జపాను జానపద కథ



చాలా రోజుల క్రితం యొహేయి అనే అబ్బాయి ఉండేవాడు. వాళ్ల నాన్నతో కలిసి సముద్ర తీరంలోని ఊళ్లో ఉండేవాడు. ప్రతి రోజూ సముద్రంలోంచి సూర్యుడు బయటకు తొంగి చూసే సమయానికి అతను రేవుకి చేరుకుని చేపలు కొనేవాడు. తరవాత ఇంటింటికీ తిరుగుతూ ఆ చేపలను అమ్మేవాడు. అతని భుజానికి ఉన్న రెండు కావిడి బుట్టలలో ఆ చేపలను పెట్టుకుని అమ్మేవాడు. యొహేయి ఎంతో కష్టపడేవాడు. అయినా పేదరికంలో ఉండేవాడు.

తన తండ్రి జబ్బు పడినప్పుడు అతని మందుల కోసం యొహేయీ ఇంకా ఎక్కువ కష్టపడసాగాడు. అయితే, ఒకసారి రెండు బుట్టల చేపలే తీసుకుని రాగలిగేవాడు. దాంతో ఎక్కువ చేపలు అమ్మలేకపోయేవాడు.

ఒక సాయంత్రం వాన కురుస్తూ ఉంది. యొహేయి అన్నం వండుతున్నాడు. అప్పుడు అతనికి తలుపు దగ్గర ఏదో చప్పుడు వినిపించింది. తలుపు తీసి చూసిన అతనికి వానలో వణుకుతున్న ఒక పిల్లి కనిపించింది. దాని బొచ్చు వానకి తడిసిపోయింది. లోపలికి రావటానికి అనుమతి అడుగుతున్నట్టు అది మ్యా  అంది.

"పాపం, దిక్కు లేని పిల్లి!" అంటూ యొహే       దానిని లోపలికి రానిచ్చాడు. ఒక తుండుతో దానిని శుభ్రంగా తుడిచాడు. తండ్రికి రాత్రి భోజనం పెట్టిన తరవాత తన వంతులోని అధిక భాగం అన్నం, సగం చేపను ఆ పిల్లికి పెట్టాడు యొహేయీ.

అన్నం శుభ్రంగా తినేసి, యొహేయీ ఒడిలోకి దూకింది పిల్లి. తన మెత్తటి, తెల్లని బొచ్చుని అతని ఒంటికేసి రుద్దింది. ఆకలితో యొహేయీ పేగులు నకనకలాడుతున్నాయి. కానీ పిల్లి సంతోషంగా ఉండటంతో అతని మనస్సు సంతోషంతో నిండిపోయింది. మరునాడు ఉదయానికి పిల్లి లేదు.



మూడు రోజుల తరవాత, బజారులో యొహేయి
చేపలు అమ్ముతున్నప్పుడు పక్కింటి మాసా పరిగెత్తుకుంటూ
వచ్చాడు. "యొహేయి, త్వరగా ఇంటికి పద. మీ నాన్నకి
జ్వరం ఎక్కువయ్యింది!"





నిండుగా ఉన్న చేపల బుట్టలతో యొహేయిా ఇంటి వైపుకి పరిగెత్తాడు. ఇంటికి చేరుకునేసరికి తలుపు దగ్గరే పిల్లి ఉంది. కానీ యొహేయిా ముందుగా నాన్న దగ్గరకు వెళ్లాడు. తండ్రి నుదుటి మీద తడిపిన గుడ్డ పెట్టాడు.

నాన్నకి జ్వరం కొంచెం తగ్గిన తరవాత అతను తన చేపల బుట్టలవైపు చూసి నిట్టూర్చాడు. “చేపలు అమ్మటానికి ఈ రోజు బయటకు వెళ్లలేను. రేపటికి ఇవి పాడైపోతాయి. నేను ఏం చెయ్యను?"



అంతలో తలుపు మీద ఎవరో కొట్టిన చప్పుడయ్యింది. యొహేయీా తలుపు తెరిచాడు. రంగుల, పట్టు కిమోనోలో ఒక యువతి బయట ఉంది.

“మీకు ఏం కావాలి?" యొహేయీా గొంతులో ఆశ్చర్యం.

“నువ్వు చేపలు అమ్ముతావా?" చేపల బుట్టలవైపు చూపిస్తూ ఆ యువతి అడిగింది. “నాకు చేపలు కావాలి. నీ దగ్గరికి ఈ పిల్లి నన్ను పిలవటం ఆశ్చర్యంగా ఉంది!" కిమొనో అంచుని నోటికి అడ్డం పెట్టుకుని ఆ యువతి మెల్లగా నవ్వింది.

“మీరు ఏమంటున్నారు?" యొహేయి అడిగాడు.

“ఈ తెల్ల పిల్లి నీదే కదా? కుట్టు తరగతి పూర్తయ్యి నేను ఇంటికి వెళుతుంటే ఈ పిల్లి నన్ను చూసి మ్యావ్ అంది. కొని  అడుగులు ముందుకు వేసి, వెనక్కి తిరిగి, ‘నాతో రా,’ అంటున్నట్టు తన పంజాని ఊపింది. ఎంతో ముద్దొచ్చి నేను దాని వెనకాలే వచ్చాను."





యొహేయీ ఆశ్చర్యపోయాడు. పిల్లిని మొదటిసారి కలిసినప్పటి సంగతి ఆమెకి చెప్పాడు.

“భలే పిల్లి!" ఆ యువతి నవ్వుతూ చెప్పింది. “నీ దగ్గర చేపలు కొనమని నన్ను పిలిచినట్లు ఉంది!" ఆమె మూడు చేపలు కొనుక్కుంది. వంగి అభివాదం చేస్తూ యొహేయీ తన సంతోషాన్ని వ్యక్తపరిచాడు.



కాసేపటికే యొహేయీాకి తలుపు తట్టిన శబ్దం మళ్లీ వినిపించింది. తలుపు తెరిచిన అతనికి పట్టణంలోని ధనిక వ్యాపారి కనిపించాడు. “దండాలు. మీరు ఇలా వచ్చారేంటి అయ్యా?" యొహేయీా అడిగాడు. తన చిన్న ఇంటికి డబ్బున్న వ్యాపారి రావటం యొహేయీాకి ఆశ్చర్యం కలిగించింది.

“ఈ పిల్లి నీదన్నమాట!" తన కళ్లు పెద్దవి చేస్తూ అన్నాడు వ్యాపారి. “నేను చేపల గురించి మాట్లాడటం నీ పిల్లి విన్నట్టు ఉంది."

“చేపల గురించా?" యొహేయీా అడిగాడు.

"ఈ రోజు ఉదయం నా కోడలు ప్రసవించింది. మనవడు పుట్టిన సంతోషంలో విందు ఇవ్వబోతున్నాను. అందుకు నాకు కొర్రమీను చేపలు కావాలి. వాటి కోసం ఇంటినుంచి బయటకు వచ్చేసరికి నీ తెల్ల పిల్లి వచ్చి మ్యావ్‌మంటూ తన పంజా ఊపి నన్ను పిలిచింది." పిల్లిని అనుకరిస్తూ వ్యాపారి తన చేతిని ఊపాడు. "దాంతో దాని వెనకాలే వచ్చాను. నాకు కావలసిన చేపలతో నువ్వు ఇక్కడ ఉన్నావు!"

ఆశ్చర్యచకితుడైన యొహేయీ తన తండ్రి ఆరోగ్యం సంగతి, ఆ పిల్లి తన ఇంటికి ఎలా వచ్చిందన్న సంగతి వ్యాపారికి చెప్పాడు.



"తమాషాగా ఉందే! ఆ పిల్లి నీ కోసం కొనుగోలుదారులను వెదికి, తీసుకుని వస్తోంది!" వ్యాపారి అన్నాడు. "చేసిన మేలుకి ఇలా బదులు తీర్చుకునే పిల్లిని నేను ఇప్పటివరకు చూడ లేదు. ఈ రోజుల్లో చేసిన మేలుకి మనుషులు ధన్యవాదాలు కూడా చెప్పటం లేదు." ఒక బుట్టలోని చేపలు మొత్తం కావాలని వ్యాపారి అన్నాడు. యొహేయీకి అతను ఒక వెండి నాణెం ఇచ్చాడు. "ఒక బుట్ట చేపలకు డబ్బులు ఇవిగో. చిల్లర ఉంచుకో. మీ నాన్నని బాగా చూసుకో." యొహేయీ మళ్లీ, మళ్లీ వంగి దండాలు పెట్టి తన సంతోషాన్ని తెలియచేశాడు.





పిల్లి పిలిచిన కొనుగోలుదారులు ఒకరి తరవాత ఒకరు యొహేయి ఇంటికి వస్తూనే ఉన్నారు. మధ్యాహ్నానికి అతని దగ్గర ఉన్న చేపలన్నీ అమ్ముడుపోయాయి. కొనుగోలుదారులు అతని పిల్లిని మెచ్చుకున్నారు. అంతేకాదు, చేపల కోసం మరునాడు కూడా వస్తామని చెప్పారు. అలా యొహేయి తన తండ్రిని చూసుకుంటూనే చేపలను అమ్మగలిగాడు.

ఆ రోజు నుంచి యొహేయితో తెల్ల పిల్లి ఉండసాగింది. అది ఎంతో దూరం నుంచి కొనుగోలుదారులను పిలుచుకుని యొహేయి ఇంటికి తీసుకుని వచ్చేది. అందువల్ల యొహేయి చేపల అమ్మకం పెరిగింది. త్వరలోనే అతను సొంతంగా దుకాణం తెరిచాడు.

మందులతో యొహేయి వాళ్ల నాన్న ఆరోగ్యం మెల్లగా కుదుటపడింది. యొహేయికి లాగా ఒక తెలివైన పిల్లి తమకీ ఉంటే బాగుండేదని మిగిలిన వ్యాపారస్తులు అనుకోసాగారు.





ఆ విధంగా జపానులో అదృష్టానికి గుర్తుగా పిలిచే పిల్లి మారింది. యొహేయి పిల్లి లాగా ఒక పంజా పైకి ఎత్తిన పింగాణీ పిల్లిని తయారుచేయటం మొదలుపెట్టారు. కొత్త కొనుగోలుదారులను తీసుకుని వస్తుందని, పాత కొనుగోలుదారులను స్వాగతిస్తుందని అన్ని రకాల వ్యాపారస్తులు ఈ పిల్లి బొమ్మని తమ దుకాణాలలో పెట్టుకోసాగారు.

ఈసారి మీరు జపాను వెళ్లినా, లేదా జపనీయుల దుకాణానికి వెళ్లినా కౌంటర్ మీద పింగాణీతో చేసిన తెల్ల పిల్లి మీకు కనపడితే, అది అక్కడ ఎందుకు ఉందో మీకు ఇప్పుడు అర్థమై ఉంటుంది.



అయిపోయింది